# స్రుతమధూలిక

(ప్రథమ సంపుటము)



మానూరు వేంకట శేషగిరిరావు, బి. ఏ.



*        *        *

మోవిసుధా ప్రవర్షిత విమోహనవాఙ్మయి!

దివ్యభావ సంభావనమాత్ర గోచరి!

దివామయ శోభిని!

సర్వమంగళా!

జీవదయా పునీతగుణ!

సేవితభర్తృక!

సంతసాత్మజా!

# నైవేద్యము

— — —! లోన జేరి ఈ వీణె కొనర
మేళవించి పైకి నను నిమిత్తు జేసి
పాడుకొనుచుంటివే కాని - ప్రబలహృదయ
దారితము లైన యిట్టి పదంబు లేమి?
నేను పాడ గలుగు టేమి?

నిండి, మూాక:

వడిన హృదయముం దెల్పు నా వాణి వగుచు
లోని యావేశమై నాకు పూని, నీవె
హృదయ ముడికించి నన్ను పాడించుచుందు
వగుట ఈ 'కృతి' నీసొమ్మె యగును. దీని
నీకె యిచ్చుటలో గొప్ప లేకపోని
ఇచ్చుచుంటిని దయచేసి పుచ్చుకొమ్ము.

ఈవు కోరకయే రచియించి, కృతికి
సిద్ధపఱచి, ప్రేమప్రబంధశిల్ప మొకటి
అర్పణముచేయ వచ్చితి నన్ను నన్ను
బెడిసికొట్టకుము, పెట్టకు బెడచెవి - పయి
ప్రతిఫలమ్మును గాంక్షించరానులెమ్ము.
అనుము...నా'కృతి' గైకొందు ననుము...

పూర్వజీవితకృతలబ్ధ పుణ్యశక్తిఁ
గూర్చి, వీనిని నీకీయగోరి, ఎంత
కాలముగ మనసుపడితి...కానుకలెప్పుడు
నిరసనాయోగ్య మగుట... వీనికయి దేవి
వైన నీవు ఆసించుచో ఆత్మ పూర్తి
గా తరించిపోవు.



## కాళరాత్రి

దివ్యుల, ప్రమత్తులను నేకతెన్నుజూచి;
భయదకాలాహిపడగల బట్టి, చుట్టి;
బుసలు గొట్టుచు, రేనాగబోడి ఉరుల
గొరికి, తెంపివేయు నొకరి కొరుఁలుగాక.
బ్రతుకు బ్రతుకెల్ల వెతుకులు వెతుకు లవగ
బ్రతుకు బరువులు ఏలలై బాహిరిల్ల



## బా ట సా రి

ప్రభ్వీ సంతోషమునకుగా బ్రతికికొన్న
బ్రతుకు...
ఈశ్వరి సైదోడు దలచి ఎత్తికొన్న
బరువు...
దేవి సహచర్యము దొరంగి దిగబడిన ఎ
డారి...
.........ఎట్లు గమియించ నగునో ?
ఆ సహాత్వము తగ్గిన అడవి జీవి
త ప్రయాణమునకు శక్తి తగ్గిపోయె,
వాడి, రాలిపోవచ్చును పాదమెత్తి
ముందు పెట్టు ముందె......



## ఆ నా వా స ము

కల దోక యెడంద నాకును గాని నిన్న
మొన్నటి దనుకనూ ఇచ్చు బుద్ధి పోక
పాడుపడ నిచ్చితిని తగువారు లేమి

... ... ... ...

వీథి తలుపు లన్నియు తీసిపెట్టుకొంటి

... ... ... ...

వచ్చియున్నదో... లేదో... సత్వరమె తిరిగి.
వెళ్ళిపోయిన దెద బాడుపెట్టి, వదలి;
ప్రీలిపోకుండ నెట్లుండజాలు నెన...!

*

## అపుడె.....

తొలుత ఆ రేఖ కన్ముందు తోచినపుడె
తోచినది...............
.....కోర్కెతో పాటు......
.........................తుచ్ఛజీవ
నులకు దక్కదను తలపు—

మొదట ఆ రూపుకలిమికి మురిసినపుడె
కలచినది అయోగ్యునిసొమ్ము  కాబడినది
దివ్య ఆత్మ అను తలపు—

## అదేలో?

ఈ అభాగ్యకరార్పితేశ్వరీత్వమున కా
హేమాద్రి యాట చాలించి దిగుట...?

... ... ... ...

ఏనా తనూపూర్ణగానంబు కాగోరి
మృత్యునిశ్శబ్దత నిజముకొనెనో...?

ఇతని సాత్తవజేసిన హృదయ మెట్టి
స్నిగ్ధతన్ గడియించుకొనెనో? అదెంతో?
'నా పునీతాత్మపీఠము జూపుకొందు
రిక్తమై నిల్చె ర'మ్మన సక్తు నయ్యో
నాడు కంపింపజేసియున్నది అదేలా?

సూ త్ర ధా రి

ఆ కరముద్రల గర్ణము నప్పగించి;
ఆ అదృష్టము శాశ్వతమంచు, బ్రహ్మ
కల్పక మని, పొంగితిని;

ఆ కర్ణధారి

కర్ణమే పైన వేరొక కర్ణధారశక్తి
...గతమని తెలిసికోజాలి తిపుడు.



## పూ ప చూ లు

జన్మచే కోరకము మధుజన్మయగుట
లేతరోజుల నిధి గుబాళించె; గాని
పసరురంగైన విరిగిన పదునులేదు,
కాడ పిందె తొడిగి రేకు లూడిపడియె
నాశ్రయించిన మధుభిక్షు వదలి యేడ్వ



ఎట్లు....

చలువకుక్షి అంబుధి హాలాహలముయొక్క
అగ్గివేడిక సెగల కె ట్లాగికొనునో?
నీరకుక్షిక భూమి శరీర మెల్ల
నదిరి, కంపించి, పెట్లు నె ట్లాగికొనునో?

పూవుటెద చీరుకొని పిందె పుట్టునపుడు
అధికసుకుమారతనువు ఎట్లాగికొనునో?

*　　　*　　　*　　　*

చేతులార తెచ్చుకొనిన చెడుగె అనుత
లంపు గుండెపొరల మాడ్పు...

*

# పాఠము

జరిగిపోయిన అదను నెట్లు తిరిగి రాదు
ప్రకృతి పొరపాటునకు క్షమార్పణము లేదు



## సు కు మా ర ల క్ష్మి

నిన్ను 'ఉంచి, పెంచుకొనగ గోరిన్ననలు'
గడించుకోలేని కడబీద కిచ్చుకొంటి
వెట్లు దక్కెద వతనికి ?

లోకకారణజన్మగా లోకు తెరిగి
కొన్న నిన్ను..........
.............నీతోడనే నన్ను...
...   ...   ...   ...

## చెల్లి బాటు

ఎంత అపరాధమో ఒనరించి నట్లు
లోకమున మోము జూపింపలేక పోవు
నవును......
......నమ్మి, లోకము వాని హస్తగతము
చేసియుంచిన దేవిఁ గాఁజేసివైవ
దాని నేమొగమ్మున జూడదలచు నైన

# అర్పణము

ఆమెవాసము నా శరీ రాణు  వణువు;

ఆత్మజీవనమధురిమయందు...నన్ను
ముంచి, యెత్తినది;

తుదకు బోర్లగించు
కొనియె యేగిన దాత్మజీవనము నీ అ
భాగ్యు దోయిలి యం; దది పాఱి పాఱి
మునకు నెక్కిపోయె.

హృ ద్భరమ్మగు నింత అమృతము పెదవి
చేర్చిన......

దొక గుక్కైన గ్రసించి నట్లు
లేదు.

## రక్తాశ్రువు

అనుభవించుటకైన
మనసు రాకుండిన
కూర్చుంటి మధువంత
కూడ బెట్టుకొని

ఒక్క మారుగ అంత
ఒడుసుకొని పోయింది
శక్తున్న కార్చెద
రక్తాశ్రువొక్కటి

## నైరాశ్యము

నిదురబోవుచునుండగా కదిపి ప్రిథ్వి
లేపిన ట్లయి; ముదవారి తోప, గనుల-
నట్టె బిగబట్టి; ఆమె పాదాంబుజముల
నిట్టె యొలికించిపోవచ్చి; యేను చూడ—

ఎలమై మింటి కెగిరిపోయినది విడిచి.

అది తలంచిన బిగియకుండదు ఎడంద
అవిసి;
　　ప్రేమపుంభిక్షము నడుగుకొనెడు
కపట మెఱుగని క్షుద్ర బికారి నగుచు.

ఇంతకును ప్రేమమాట యీ ఎడద జోరక
మనిన దానికి ప్రతిఫలమనుము దీని.

ఎన్నొ జన్మలుగ నిగురనిచ్చి నట్టి
పొడి యెడారుల గుండెలో చెలమదీసి,
ప్రేమ చిమ్మించెను తుషారలీల దేవి;

ప్రేమజలపాతము పవిత్రపెట్టినట్టి
హృదయపద్మము జేగొని యెత్తినాను
దేవి పాదములం దుంచ దివిరి చూచి;

పాదముల బడుటకు ముందె వాడిపోయె

## రే స ప్త మి

దాచుకొన్నట్టి తనదు నేత్రముల దవిలి,
తన మధురదృక్కు కాశించి, తలకుచున్న
బ్రతుకు కొకసారి అమృతలేపన మవంగ
నేడ్చు నేడ్పులలో వినిపించి నట్టి
చెలువు గనుటకు కనులు విచ్చినది దేవి.

మనుజధోరణి లోనికి మలుపుకొనెడి
యాప్తజన వాక్కులను నెద కందనీక,
ఇంద్రియజ్ఞాన నాళ్లు స్తంభించిపోవ,
స్వామి పిలుపున మైదెల్సి, సాము జేసి,
పెటపెటం బ్రేగులు బగుల విచ్చి నోరు,
సొనల తేనెల మాటలాడినది దేవి.

తనువు గరగరికలు వార దట్టి నిముర
జేతు లెత్తియలేక వాల్చినది దేవి.

ఆత్మసతి సేవ మగ్న మహానుభావ
దర్శన సుభాగ్యసుధ నానదలచి, తిరిగి
గుటక లానుటకై తలకొనెను దేవి.

కరిగి ద్రవియించిన యెడంద కారలేక
కుళ్లగిలి, చిమ్మి, ప్రవహించె కళ్లనుండి.

ఈశుకై యట్లు తిరిగి పుట్టినది దేవి.



## గమ్యము

దేవి గుణములవెలుతురు తీరు లందె
తలపు లన్ని ప్రోగు పడెను;
రాజ్ఞి సౌందర్యపు పవిత్ర రాసు లందె
కోర్కె లన్ని గుబురుకొనె;
రాజ్ఞి యనిమిషదివ్య నేత్రముల యందె
దృష్టు లన్ని నిశ్చలత;
రాణితను వినిస్సృతమధు సోన లందె
ఆత్మ పులకలు;
దేవిజీవన సంగీత భావములనె
మరిగి వే దానుకొన్న భ్రమలు.



**ఆ మి తి**

దీర్ఘ భయద నిశ్శ్వాసపుం దీవ్రగతిని
నేను వినలేక తగ్గగోరాను......
మృత్యుభీకర నిశ్శబ్ద తెసగ నేలా ?

ఱేకు లరవిచ్చి దృష్టులు ప్రాకగోర
బూర్తిగానే అవి నిలిచిపోవ నేలా ?
ప్రాణయాతనా శాంతి కోరాను. జన్మ
యాతనా శాంతి సత్ప్రాప్తి యగుట యేలా ?
మానవత్వము ద్రవియించి నేను చూడ
ననిమిషత్వము తో దేవి కనగ నేలా ?

... ... ...

అప్పటికి శవమ్మే మిగులాయె గాని
కొంత సేపుకు స్మృతి తక్క కొదువలేదు



## ఏ మెు !

స్నిగ్ధ మీా గుండె లిట్లు ఘూర్ణిల్లు నేల ?
బాష్పవారిప్రళయపుం బ్రివాహగములు
కాలసర్పపు బుస కొట్ట నేల నిట్లు ?
ఇట్లు రాజి, రాజి, యెడద పెట్లునేల !
మెదడులో తుపానులు రేగి చెదరునేల ?
జీవితప్రళయము దాపు జేర నేమొ !

. . .　　. . .　　. . .

. . .నీపూపవాణి మాధురుల నెరిగి
దోచుకొనిచ్చితినా!. . .ఎద రోచులెల్ల

## తరువాత

మధుఋతు వుడిగిపోయిన మగ్న జీవి
కం దలంచుకొనిన ఆత్మ కదిలిపోయె;
ఎన్నినాళ్లుగనో మధురించుకున్న
పువు పెడందను భూకంప ముప్పతిల్లి
కడలు ఘూర్ణిల్లిపోయె;
లోని మధువెల్ల విరిగి బరువయి
అడుగుకు దిగె;
జీవిక గ్రసించబడి, నీల్గి, చెదిరిపోయె;
గుండె పెటిలి, నిప్పుల మిణుగురులు రాలె;
మొగము కెగతట్టి కన్నులు పొగలువారె;
బ్రతుకె పొగవారి బొగ్గయి చతికిలపడె.

క్రమ్మివేసిన వేల మేఘముల గములు !
మూగియెండ దుర్భర మాయె...
ఎన్నినా ళ్లైద్వేపలయు మహేశ్వరికై !

మొగము వాయదు, కడుపుబ్బబోదు, తనువు
నల్లబడదు, నైరాశ్యము పెల్లగిలదు;
రూపు చెడి, చెల్లిపోవలెనోపు...ముందు



## నైస్పృహ్యము

ఓ దేవి ! ఓ దేవి !
ఓ దేవి! ఓ దేవి !

నువు లేని ఈ దుఃఖ మెంత తీరని దాయె!
నువు కాని చోటెంత నింపరానిది ఆయె!
నువు లేని బ్రతుకెంత భీతావహం బాయె !

బ్రతికుండి నాయెడద
నందుకో గలిగావు

మరణించి నాయెడద నెత్తుకొనిపోయావు
ప్రాణములు తనుయంత వెంటబడి వచ్చేవె
నీ పనిని గనిపెట్ట నాజ్ఞ బెట్టకయున్న



## ఆ ధా ర ము

ఈవు మాత్రము నా కప్పగించుకొంటి
వేనె నిర్భాగ్యుడ నయి దక్కించుకోక
కూర్చుకొన్న కాణాచి పోగొట్టుకొంటి.

కడకు నీ హృదయము చెంత గాని వీని
కింత వైశాల్యమును చూపు మేమి దేవి

ఆ తలపె లక్షయి సమాప్తి అనని ఈ వి
షాదజీవిని బ్రతుక నొసగు.

*

# వార్తాహరులు

ఇటు వచ్చి ప్రభకన్నె లేతెంచుచున్నవి,
ప్రియ వార్త తెండని వేడుకొంటి;
అవి నీకు కలియుచో అడిగి పంపుము దేవి !
ఏనాటికైన నీ యేడుగడయె.
వచ్చి పోవుచునుండు పవమాను; డతనితో
ఆజ్ఞ పంపినను నా కందజేయు
ఆప్రాంతమును గూడ ఆవరించును గదా
వార్త రోదసి యందు వదలు; చాలు.

## వారసత్వము

పోవునప్పు డొసగి పోయినావు... దేవి !
శోకమును;...నీదు పేరుగా సుప్తితోడ
స్వంత యనుభవము కొఱకు పదిలమగును

అంత కెవ్వరు మించి యొసంగి పోయి
నారు... దేవి! ప్రేమిణాలు స్నాతకులకు

*

## తే నె బు గ్గ

ప్రోవి జీవితముల కలపోసికొనుచు
బ్రతికినట్లె బ్రతికి, తెల్లవారినావె !

తేనెపొర లోకి పొదువుకోగాన కారి,
తోగి, పంచేంద్రియములకు తోచి చనితె !



## కడకు

ఎడద లో విప్పారి
గుండెంత తెగబ్రాకి
నెత్తుట కలయిూది
నెరసిపోతే ! ఛాయై నెరసిపోతే !

వెలిగించి ప్రతిక్రేవ
వెలుగులో మునిగించి
కడ కిట్లు కటిక చీ
కటి క్రోసితే ! ప్రేమా ! త్రోసిపోతే !



## స్రుత మధూలిక

'కుల జీవిత'జ్యోతి కొండ యెక్కినది
'అలరు బ్రతుకు'వెల్గు లస్తమించినవి.

'ఎల జీవ'నవక మెండిపోయినది
'దుగ్ధ జీవమధువు' దొర్లిపోయినది.

బిగుతు మాంగల్యము పెరిగిపోయినది
నా విపంచీధ్వని నడక మారినది.



మ ది

దంపతీస్నేహ సూత్రమాదకతె చూపి
పరిచయ విముక్తవైరాగ్యము రుచిచూప
కస్తమించినావె నను ఖండజ్ఞు జేసి?

జీవితమున వనితకార చెలువములనె
గాని కటువు ఛాయల చవులీను మునుపె
చెల్లిపోయితే సౌందర్యజీవి వగుచు?

అంగనానైజ నిజ గుణ త్యాగములనె
గాని లాలసత్వపు ఛాయ గాని లేక
చేరుకొన్నావె సిద్ధులు చేరుచోటు?

* * *

పత్ని ఏ లక్షణము లోక పతిబ్రతుకుకు
గర్వ కారణములో అన్ని కలిగియుండి
అతని రాజ్ఞీవతుని జేసినట్టి దేవి

*

## కాక .... ?

తల ధరించి ఆరాధించవలయు దేవి
వైన నిన్ సతి వనుకొనినానో ఏమొ?

ప్రేమ నేర్చుకొనుట కైన ప్రియతమ వగు
నట్టి నిన్ పశుతను గనినానో ఏమొ?

వ్రేలితాకున మధుగీతు లాలపించు
వీణె తీగెల తెగ లాగి విడిచినానో?

అట్టె చూచుకొని పులక లందవలయు
సుమ సుగంధము వాసన చూడగోరి
కరముల నలిపివేసిన ఘనుడ నేమొ?
కాక...............

## చి ర ధ్వ ని

కన్నె ఘూక మానాటి ఆ కాళరాత్రి
మందు పడమటికొండలో చిందినట్టి
గుండెగొడ్డలి స్వరములు కోట్లమార్లు
ప్రోగియుండును.

నేటి కాగలేదు.

ఇంక నెంతవఱకొ? ... జీవితాంకమందు



## గా లి మే డ లు

రాజ్ఞి కట్టిన గాలిమేడలు పునాదు
లెసగి పూర్తియగు దినాలు పొసగె; కాని
అందు క్రీడించు దినము లాయమకు లేవు
ఇంక వాని యాయువు నిల్చుటేల ?...

—o—

## ఆ శక్తి

ఒక్కొక తుపాను గాలించ...ఊగు మనసు
మార్గమున బెట్టె ఆ వాకుమధువు వెలుగు
ఎన్నిటి కెడ మైనను...మధు హృదయ దేవి
... కెడము గాకున్న గడియ బ్రతుకు
బరువు లోది కాదనుకొనే వాడ; నిపుడు
గడచునో బ్రతుకు పొడుగు కటుతమస్సు

ఒకక్క విరి నైరాశ్యాన ఊగి, పడుచొ
వెంట నూడిన దే 'పతి వెన్నుప్రాణి'
ఆ బహిఃప్రాణి పోవగా అనుసరించ
లేని శక్తి.........



## అ ను వ ర్త న

ఆత్మనాథుని పిలుపున నరిగి కలిసి
ఈ నదీకన్నె మన్నించు నెప్పటివలె
ఆ సముద్రుని హృదయము మోసపోదు.

కాని నా ప్రాణధాత్రికే కరుణలేక
ఎంత పలవించినను ప్రతి యెలుగు లేక
అటవిరోదన మనిపించు నాత్మసరణి.

కడుపులో మడంగిన ఉషఃకన్య నొసగి
ఈ నిశీకాంత మన్నించు నెప్పటివలె
లోకబాంధవ హృదయకల్లోల మవదు.
కాని నాప్రాణధాత్రికే కరుణరాక
ఎంత పలవించినను ప్రతియెలుగు లేక
అటవిరోదన మనిపించు నాత్మ సరణి.

అభాగ్యము

ఆత్మ మధుమూ ర్తి యే మాయమయ్యె గాని
అమృత చైతన్యములు చల్లనై మదించి
కురియు వెన్నెలలను బోలి, విరియునట్టి
ముగ్ధ మల్లియ లెప్పటి మురుపు మురిసి,
ముత్యములు రాల నగియెడి మొగము లూపు.

ప్రాణధాత్రి స్మితానన పద్మ మొకటె
అగుపడుట మానె కనులకు నంతలోనె
సంతసింపించుకొనుట కీశ్వరుడె లేని
ఈ భువీధర మెందుకో ఎప్పటివలె
మొద్దు వలె నిక్కడే యుండె మొదటినుండి.

దేవి కలిమిని మోదించి తేలు నాళ్ళ
నుండియును నున్న వే కదా మండిపడుచు

నున్న విప్పుడు నీ గాలి, వెన్నెలలును ?
వీని కింత చిరాయువా ?

ఈ ప్రవాహము ఇంకను ఇంపు లొలుక
పారుచున్న దే? చెలిప్రాణి పార దేమి?
దేవి బింబము జోడించి తేటపఱచి
చూపు నిది నన్ను మాత్రమే చూపునిపుడు
నిలిచియున్నదా జలములు కలగిపోక ?

కాలిపోయిన దానితో కాలిపోక
ఇంకనూ నిల్చియున్న దీ యెందుకట్టె
దీనికిని ఇంత ఆయువా ?

ప్రామియున్నది వసికూడ వాడకుండ
ఈ పాదగృహంబు భయమును రేపుచుండె

ప్రాణచైతన్యములు లేక పరిఢవిలని
వాడియే కాని—నా కగుపడదు దేవి.

నేడునుఁ కొట్టిరే గంట లేడుమార్లు!
ఏడు గంటలు కాగానె ఏగుదెంచి
............ పించు. కమలనేత్రి
కాంతయే రాకపోయెను గాని యిప్పుడు

కనులు మూయుచో కనిపించు; కనులనాడి
నిద్ర రానీకపోవు.—
నిద్రలేచుచో భయమయి నింగినాడి
కనులు తెరిపించనీదు.
దేవి కనుపించనట్టి ప్రదేశమందు
బ్రతుకు వ్రాసెను గాబోలు పాడు విధిని

## నీవు - నేను

'జీవితానుభవాల పాలీవ?' అనుచు
నలుక బీడించి,
'కాకెంగిలైన చేసి ఈవ?
నీకిది ధర్మమాయెన?' అటనెడి
ప్రాణప్రియ నీవు;
జీవచ్ఛవాన్ని నేను.



*         *         *         *

ఎప్పటికి ఎంతకును మార్పులేని నట్టి
దేవి దివ్యతముందు నదించి, తా చె
మర్చిపోయెడిది బ్రతుకు......

*         *         *         *

# వాంఛ

'మీదు కోసమె కాకున్న నాదు బ్రతుకె
దుర్భరమయి చేరెడిది భూగర్భమంద
టన్న... ప్రతిఫల మాశింతుననుకొ నెదరె ?
చిరునగ వొకటి చాలును జీవితమున
అశ్రుకణ మొకటే చాలు సంతమందు'
అన్నతొలినాటి నీ వాంఛ కన్నమించి,
నీకు నే నెప్డు చేసిన పోకలేదు.



జ వు

ఏమి ఆశించియుండెనో, ఏ విధమున
గాని తీర్చుకోలేని వాడైన యితని
వలన ?

ఉపద మించిన పెట్టుబడిని పెట్టె.

... ... ... ...

అమరకుండినచో ప్రాణమైన నొసగి
తీర్చుకోగల్గు నాశయు తీర్చి పోయె.

... ... ... ...

ప్రేమ ఋణముల బడిపోయె! నేమికాను

... ... ... ...

ఇంక ఈతని బ్రతు కామె కంకితముగ
ఆత్మ త్యక్తమయెడిదనక- అనుభవించి
వైచు నెటులనో కాళత మాచలాల
అందులో గొప్ప సుఖప్రద మనుభవించు



## నిరీక్షణము

ఈ విశాలభువియెడారి యిరుకు లందు
ఆత్మహత్యా వాటములోన అట్టె నిలిచి
చూచి, చూచి, నిరాశనై చూచుచుండె
వీలుపడని జీవికనాటి పూలు... పేర్చి,
అంజలిని బోసికొని... వాడునంచు నశ్రు
వులతో తడుపుకొనుచు నుండె...
ఓతపస్వినీ! ఏమూాల నుంటొ ? వచ్చి
హత్తుకొనుము......

## దే వి వే నా

'మృత్యుగహ్వార' ద్వార 'తమిస్ర' దుర్గ
సీమ నొంటరివై యుంటి... వేమి సుఖము
వెలుతు రంతయు నాయింట చెరిగివైచి
చీకటిని మాత్ర మటు మిగిల్చికొనునపుడు
ఎంత వలదని మొత్తుకొనేటి వాణ్ణి.

నీ కవాటము నొద్దనే నిలబడినను
తలుపు తీయించ వెంతగా తన్నుకొనిన!
స్వయముగా దేవి పదనఖ పాత్రియుడయిన
ఈ బికారి యింటి బికారిణి వయి ఇతని
పాద సన్నిధినె పరమావధిగ నెంచి
యున్న ఆనాటి నా దేవి వోయి నీవు!

అంత నీ విశాలపు టెద ఇంత ఇరుకు
చీకటి గుహా... నిట్లుండుట చెల్లునోయి!

---గాదు...లోకమునె సుఖపడబెట్టు
నీ ఎడంద కొంటరితన మోయి! శాంతి!

కొంచె మిటు వంగి, చూడు. నీ కొరత దెలిసి
ఇపుడు లోకము లోకమే ఎట్లు జడిసి
కొనెనో? దానిపై నీ దివ్యకోమల కర
ముంచి ఆశ్వాసిల్ల మనుము.



## స న్మా న ము

వెతకి... వేసరి...నీయింట బెట్టినాను

కాలు............

......పసుపు ముసుగు దాల్చి...

........................ఏల మొగము

చాటు వేసి పోయితివి

ఇదేటి అతిథి

మన్ననయొ! చెప్పు

•

# అ తు కు

భిన్న దేహస్థ స్త్రీయాత్మ వివిధ రూపిణీ !
—నిజాత్మీయ శకలమై ఎడము పడిన
విధిని తెగగొట్టుకొని పోతి వీవు—
కాని
బ్రతుకు సరిపుచ్చుకొన గష్టపడుచునుంటి



## ఆ చూ కీ

జిలుగుచీకటి మంటపములకు మధ్య
కొలువు దీర్చు ఘూకాంగన కూతలందు

చిగురుతోరణ మంటపశ్రేణు లందు
కవను బాసిన పికరాజు గానములను

గ్రీష్మతప్త విహంగమార్గీయకలిత
ఛాయను జలధరభ్రాంతి జేయు కేకి
నీ విధాత నర్తనపు మన్నెఱికమందు

పిందె పుట్టుకువచ్చి పూసుందరాంగి
ఎడద రాలిపో నళియేడ్చి యేగుచోట

ఆశతో కొండ దిగి వచ్చి, అంబుధీశు
గలిసికొన్నదో...లేదో... ఆక్షణమునందె
ఇగిరిపోయిన ఝరరాణి యేలఁందు

కలియఁబోయి రాగముతోడ కలియలేక
జీరవోయినట్టి విపంచి జీన లందు
గృహమునకు వెల్గుతెచ్చెడి గృహిణియంచు
తెచ్చుకొన్న శంపావతి వచ్చి ఆత్మ
గృహము మెట్టినక్షణమె ఆరిన...
నదించిపోయి దురపిల్లు
వరుణుని కూయి యందు

స్నిగ్ధమై వినపడు దేవి జీవితంబు

*

క్షమార్థి

* ఏకీకృతి:

"నిలక ఈ గుండె ఘూర్ణిల్లనీ త్వదీయ
పాదములు గాని వేరొండు పదము గోర
దీ బ్రతుకు తెల్లవారనీ ఎడద ప్రభుని
మించి మఱొకరి కైన సహించబోదు
ఈ విపంచి తెగిపడనీ మీ విపంచి
కాని దానితో స్వరియించబోను స్వామి
ఈ సుమలత జీర్ణించనీ తా సహించ
బడదు ప్రభుప్రమాను తప్పింపబడినయెడల
జలము లడుగంటనిండు ఈఝరము స్వామి
తమ జలధిదారి తప్పి సంగమము కాదు
కునికి ఆరనీ ఈదివ్వె కోర దొరుని
మనికి జోతికి వెలిగించుకొని వెలుగదు"

* అనన్యాసక్తి

"మాఁడి చావనీ వెన్నెల మాని చక్రవాకి
కన్యము లన్నియు వర్జ్య మగును
మాఁడి చావనీ సుమసుధ మాని భ్రమరి
కన్య మకరందములు: రుచికరము కావు
మాఁడి చావనీ బిసినియే మంచి హార
మాను రాహంసి కన్యము లవవు; సుంత
రాలి పొలియనిమ్ము గులాబి మాని
తుమ్మి పూవుకు షట్పాది తూఁగబోదు
సోలి పొలియనీ స్వీయహృల్లోలు తనువు
నంటిపెట్టుకునే ప్రాణ మప్పగించు"

అనెడు ఆనాటి నీదు గీతాలు వీని
క్షుద్ర శ్రవణాల మ్రోంగ ఊకొట్టగలను
అనను, చేయను నీకె చెల్లగును దేవి
త్యాగసాముద్రివే యాదు; ధరను దేవి
లుబ్ధులీ బొంట్లు వేలు పోలుదురె నీకు!
అగుదు వో దేవి దివ్యదివ్యాణి వీవె!
మానవ క్షుద్రమాత్రుడ నేనె అగుదు.
భువిని స్వాతంత్ర్యహీన హిందువునిజన్మ
ఎత్తనే రాదు వతనివై యెత్తుకంటె



చూచి, సంతసించుకొను రాజ్ఞులు గతించ
నెవరి కొఱకొ... ప్రపంచానుభవము ?
కొసరి, గీతులు పాడించుకొనెడి రాజ్ఞి
లేనపు డెవరు విని, మధురించు కొఱకొ ?
ఇహాము నందె లేనప్పు డిం కేటి యాస!

* * * *

మాసిపోయిన జీవి తామాసు లందు
పూర్ణిమాహాసములు పులుపులు విదిల్చు;
సుఖపడెడిచోటు నీజన్మ చూడలేదు.

* * * *

ఓ అహాస్వినీ ! నీ నీడ నోరగిల్లు
సుఖదినమ్ములు పోయిన చోటు లందె
తీగ తెగిన విపంచిని మ్రోగజేసి,
చితికిపోయిన యెడదకు అతుకు పెట్టి
పాడుకొనుచున్న వాడను భావగీతి;
కాకపోయినచో బ్రతుకంగలేను.

* * *

ఏమొ నాకు గల యెలుగు నెల్ల ఎత్తి,
దెసల వినిపించు నంతగా మిసిమిగీతు
లాలపించెద దేవియు నాలకించ;
నన్ను ఎంతగా కాదనుకొన్న గాని
దేవి మెప్పుకొఱకె నేను దేవురింతు.

దుఃఖ మందె సంతోషము తోచ నిల్చె
పాడుకొందు నీ వెల్తురుపాట లన్ని
ప్రభుడుఁ బ్రతికియు చచ్చినవాడె యైన
జక్కవపడంతి కుహూకుహూస్వరము వేయ



## అస్పృశ్య

పాదులో అంటుకొని, ఏరివలన గాని
ఏమి గుర్తింపబడని మహేందిర యయి
నేను మాత్రము పసిపట్టనైన...తన్ను...
తెచ్చుకొని, ఆత్మరక్తము నిచ్చి
గుండె యెత్తునకు బెంచుకొని ఎదనొత్తుకొంటి.

... ... ... ...

అట్టు లెంతో చేయుచువచ్చినట్టి నాకె
కన్ను కుట్టగా పట్టలేక ఒక పూవు
ముట్ట...పులుకున నెత్తురుబొట్లు కారె.

... ... ... ...

"మీరె యిట్లు తమ నరముల బారు నెత్త్రు
బోసి, ఈనా శరీరము పూవు, పిందె వేయ
—ప్రేమతో — వర్ధిల్ల బెంచుకొనియు
మోహపు ప్రకోపనమున కపోహ యేల?

వాడి, భూమిపై రాలిపోవలెనె కాని
ఎప్పటికని సౌందర్య మస్పృశ్య యనుచు
అనుభవింపరాని" దనుచు అరయజేయు
బుద్ధి చెప్పించుకొని, స్వాదు వ్రానగలిగి
గుండె బిగబట్టి, చూపెట్టుకొనుచు వచ్చి
జరిపితినె పాడవు బ్రతుకు......తరమువఱకు



## ప్రాకృతి

మెరుపు మెలికల లిఖియించి మేదిని నర
బ్రతుకునకు దర్పణమ్ముగను బట్టుచుంటొ?

నీర వాత్మాంత రాశాప్రచార సరణి
గాఢ కాలిమాసాంద్ర యాగాధసీమ
జీల్చి మిణుకని వెలువడు చిన్నిరిక్క
లంబరపథాన కరిగి జీర్ణంబయి చను;

మబ్బుటెల్లల వంకల కబ్బబోవ
దెప్పు డచలత; వేకువ నేగు రాత్రి
కల్గు కాలిమాచ్ఛాయ దిగ్తటము లొరసి;

జీవనా త్పూర్వక్షణమున చెలగు నెట్టి
అంతిమక్షణమ్మొ? వచించు మంతరంగ
మందు దాగ జీవనగర్భ మరణకణము.

మధువు...కల పాత్రలందెల్ల పదిలపడక
ఉన్నదంతయు నొకదాని నున్న కతన
పాత్ర పోర్లిన మధువంత వార్ధలయ్యె.

... ... ... ...

ఒక్క పాత్రమున త్వదీయ యుర నిరంత
రోక్త మధు వంత పట్టుట కొదవలేదు.

... ... ... ...

ఇన్ని యెన్నొ పాత్రల నింపనిచ్చు మధువు
పట్టబోయిన ఆ పాత్ర పగిలిపోయె.

... ... ... ...

మూసిన కనులతో నింపబోయి యుంటి
వంత మధువు నొకే పాత్ర యందె పడెను.
చుట్టు నెన్ని యున్నవో...అలు చూచి నింపు.

... ... ... ...

ఈయబడిన ఆ పాత్రలో బోయుగలుగు
శక్తి నీకు స్వభావ ప్రసాదితంబు
అస్లై అన్నిటినిన్ నింప నౌ నటంచు
తెలిసికోను దనకనే అది వలయు సుమ్మి

ఎత్తవచ్చినచో పాత్ర నెత్తి, దాని
ధార నీ దానితో కల్పి ధన్యుడగుము
పాత్రలన్నియు త్వరలోనె పట్టబడును.

... ... ...

మధ్యలో నొండు కట్టనీ ! మానబోదు;
మిగిలినది నింపుచుండును సగముసగము.

•

………దివ్యత్వసిద్ధి కాజేసికొన్న
నా హృదంతరమధు వంత…కొఱకె
సర్వసామ్యసంకలితము జరుపుకొనుట
కోర్వ్యాలేని ప్రపంచపు టుసురు తగిలె.



*　　　　*　　　　*

ఎవరి జూచుకొని, జగతి, నీశ్వరు, సక
లమ్ము మఱువబడెనో...ఆ పదమ్ము తాన
వదలి, కనులు విప్పించిన ప్రబల త్యాగ
మెంతొ గణియించలేను.

*　　　　*　　　　*

## ఒ క నా డు

బ్రతుకు బ్రతుకు శాసించగలట్టి రాజ్ఞి
గల దినాలు గల వొకప్డు......

ఇవమికొని, పుక్కిలించబోయి, అమృతఝురి
బడి, మునింగి, తేలిన నాళ్లు కలవు.

త్వన్ముఖార్ద్ర చంద్రమనుండి పారి చిమ్మెడు
అమృత తుషార శీకరా ల్మోము ముసరి;
త్వన్నయనజ్యోతులు వెలిగి పరపెడు
కిరణాలవెల్లువ కళ్ళలో వ్రాలి, గ్రుచ్చి;
నీ వినిర్గత నిశ్వాస స్నిగ్ధపరిమళముల వీచిక
ప్రిదిలి శ్వాసముల నూది,
పులకరింపించినట్టివి కలవు నాళ్లు.



# ఎన్నడో

చీకటిని ప్రాకులాడెడి జీవితమున
కెలమి వెన్నెలదొప్ప లందిచ్చునాళ్లు

చివికిపోనిచ్చు నిస్సార జీవితమున
కెలమి మధుధునుల్ చుట్టుముట్టించునాళ్లు

తీగ తెగి పడియున్న జీవాగమనము
నందు బ్రతుకు సంగీతమయమ్ముచేసి;
గృహము గోడల కాహ్వానగీతినేర్పి
ఇల్లు స్వర్గతలమ్ము గావించు నాళ్లు

ఎన్నడో కలవు.



## జన్మ

ఈ అభాగ్యుని వీధికి నీ అమేయ
దివ్య సౌందర్యరథమును ద్రిప్పి: మగిడి
నపుడు
'జాబిల్లిపల్లెర' మందు తార
కామణుల నారతి నొసంగె కలువకన్నె

నీ వెలుగుమొగ మటు త్రిప్పినావు,
........................నేను
భయద భీక రాంధస్సులో ప్రాకులాడు
చుంటి.................

## బ్రతుకం

నీ కలిమి పెంపు లోకోత్తరీక ఇనుమ
డించిన అదృష్టవతుని గావించె ననుచు
నెంచి, బ్రతికిన నాళ్ళు నా కెప్పుడో కలవ
టంచు నిప్పటికిని చెప్పుకొంచు మనెడి
దినములే యెప్పుడును సుఖదినము లగును.

నీ కొఱకె బ్రతుకు బ్రతికి నిద్రపోదు.

*

## చి త్ర కా రు డా

చిత్రకారుడా! బేర మిచ్చెదను కష్ట
మునకు ప్రతిఫల మంతగా పొందగలవు
కాని ఈ పని నీచేత నౌనదేన?
నీవు జన్మలో గనని వానిని రచించ
గలవ? ఆమె స్వప్నముగ సాక్షాత్కరించె

ఆమె గుండె నా గుండియ ననుసరించి
కొట్టుకొనది. మఱి నీకు - ఇట్టిపనులు
అనగ - శబ్దమును రచించు మనిన చేత
నగున? ఆమెదౌ ఆమందహాస పూర్ణ
సౌందర ముఖము ఆ మధుచక్షువులతొ
ఆమె పూతాత్మతోడ నే నగుపడించ
గల్గుచో...అంతేల? ఆ కలికి...హృదయ

మెల్ల దోచుకున్నా దన్న ఇంతచాల ?
ఇంక ఆ పాదముల చెంత నింకిపోని
కజ్జలము కాల్వలో వాని గడుగునట్లు
నన్ను చిత్రించ వలయు......

*   *   *   *

ప్రేమ హృదయమునకు చిచ్చుపెట్టి చనియు
కవి బ్రతుకుకు ఆనందము కావలెనది

*   *   *   *



## నేను - నీవో !

గాలితాకఁ దిన్న చిగురుమాల నేను
గాలితాకఁ గాగిలిఁ దీర్చుకాడ నీవు

రసత లేనియట్టి జలమురాసి నేను
జలము కలుపుకొనెడు పాలజలవు నీవు

పూల రాలనున్న సురభిపొడిని నేను
పొడిని తడిపి నిలుపు తేనెబుగ్గ నీవు

జలమురాజుకొన్న మెఱుపుచార నేను
చలువ లాచికొన్న మొగిలుసరము నీవు

ప్రభను మ్రింగి క్రాలెడు కాళరాత్రి నేను
ప్రాణధార లీను ఉషా ఉపదవు నీవు

విరిసిన ఋతువున తలకు పికము నేను
విరిసిన పికము కంఠసుస్వరము నీవు

 

## స్వ భా వ ము

ఆ వదన వినిర్గత కిరణాలి విచ్చగూడు
నీ విముగ్ధ నయనకోరకములు.

ఆ నిలువురూప మదిరజ ల్లాని జలదరించవలయు
ఈ నవ కారు టెండు కట్టె.

ఆ తనువు జవ్వసోకి పుల్కరిలవలయు
తగులు తెలి వారినట్టి
ఈ తనువు నిడుపు.

ఆ తరిపి తీపివెల్లి నీరాడవలయు
మొక్కుకున్న ముడుపు.
ఈ విముగ్ధప్రాణి

# ఆ మె

ఆమె పొందిన శోక విషాదామ్రగీతి
హూష్పు...లోకమున జిరాయు వోపుకొనియెః

పోవుచో ఉషస్విని కళాజీవనమున
ఆమె సౌందర్యలేశము నచ్చుగ్రుద్ది
కొంత చూచుకొనుచునుండగోరి, పోయె.

ఆమ్ర పికవాణి మధుజీరయలత లందు
ఆమె మాధుర్యలేశము నచ్చుగ్రుద్ది
కొంత చూచుకొనుచునుండగోరి, పోయె.



# ఊరట

తారకాప్రభస్వినుల తళ్తళల లోకి
గాంచి గ్రుచ్చబడి పులకరించినపుడు
ఆ కనుంగవ మిలమిల లోకి గాంచి
నట్లు బెంగ తీర్చుకొనెద నెట్లో కొంత

చంద్రికామధుస్విని ప్రభా స్నాన మందు
తన్వి సౌందర్య స్నాన మాదకత పొంది
బెంగ తీరిపోవు......

*   *   *   *

ఆత్మ సర్వస్వామ్యత కుబ్బి అలరి నట్టి
ఆ మహా దివ్య సౌందరీయ గరిమమును
ఈ భువమ్ముననే వేసి మోంగె నామె;
జీర్ణ మొనరించుకొన్న నా జీవధాత్రి
సౌందరీ యాణువుల కల్మి సంక్రమమున
బంగరు గులాబులు సుమించె పృథివి—

ఆ మహా దివ్య సౌందరీయ ఘనత నిటు
నా మొగమ్ముననే వేసి యామె పోమె.
ఆహుతయి, ఒంటపట్టిన ఆమె అంద
మును లగించుకొనిన అగ్ని మిణుగురులను
గాంచుచో కొంత దేవివిప్రష్కమణ బాధ
తగ్గిన ట్లుండు.

*   *   *   *

*                    *                    *

వనితకారము లోని దివ్యత్వ మొకటె
మించి తోచదు ఈ జన్మ అంచు వలకు.

*                    *                    *

నా ప్రతి పని దేవి పదమును ప్రకీర్తి
చేయువలయు.

*                    *                    *

.

వేల్పుబహు శబ్దమే కానీ

వేల్పు సగుణత్వమే కానీ

గిట్టనీ తత్వాని కిలవే

ల్పయితి వో దేవీ!

పాషాణ తత్వాని కెదమో

నయితి వో దేవీ!

## పూ ర ణ ము

పిలుచునది ఏరో కనుగోవె...
...  ...  ... వీరి కెందుకోనె
నీదు పాదము లంటుకొన్న జోలి !
నగ్న ఏకాంకజీవికా నటుని జోలి !

**-: వా ణి :-**

ఆత్మ విశ్వ విపంచికాహ్వాన స్వరము
యొక్క అణగిపోయిన తోడు నొసగు తిరిగి.